# అమ్మ ఒడి



- సరస్వతక్కయ్య

# అమ్మ ఒడి



రచన :

**సరస్వతి అక్కయ్య**

ప్రచురణ :

**శ్రీవిశ్వజననీపరిషత్, జిల్లెళ్ళమూడి -522 113.**

బాపట్ల మండలం, గుంటూరుజిల్లా.

ఫోన్ : 08643-227324, 227492 , సెల్ : 9490307364

# మున్నుడి

అంతరంగమందు ఆత్మగా భాసిల్లి
భావ భాగ్యమిచ్చు భారతీవు
కంఠ సీమనందు కమనీయ శబ్దమై
పలుకుచుంటివమ్మ ప్రణతి నీకు!

1923వ సంవత్సరం మార్చి 28వ తేదీన రంగమ్మ సీతాపతి దంపతులకు జన్మించింది అమ్మ (అనసూయాదేవి). తనలో వ్యక్తి భావంలేదు. అవధులు అధిగమించిన ప్రేమ - వాత్సల్యం - కారుణ్యం - మాతృత్వం - సహజత్వం - సమానత్వం - ఆమెలో ఆవిష్కృతమైనాయి. అవతారిణిగా, విశ్వమానవిగా, విశ్వజననిగా విశ్వజనులచే పూజింపబడింది అమ్మ. ఆమెయే "శ్రీ జిల్లెళ్ళమూడి అమ్మ" ఆర్తులకు ఆరాధ్యదైవమై, అన్నార్తులకు అన్నపూర్ణయై, జిజ్ఞాసువులకు జ్ఞాననిధియై హృదయ సామ్రాజ్యాలను అధిష్టించింది.

"నేను అమ్మను - మీరు బిడ్డలంది"

'మీరు కానిదేదీ నేను కాద'ని అభేదాన్ని ప్రకటించింది. తమ "ఒడి" చేరినవారి కంటతడి తుడిచి, వెన్ను నిమిరి, వారి బాధలకు తాను వెన్నలా కరిగిపోయింది. కౌగిట చేర్చుకొని "నేనున్నానుగా!... భయమెందుకు" అని ప్రోచిన దివ్య జనని శ్రీ అమ్మ. అలాంటి దివ్యమూర్తి చెంతకు చేరింది సరస్వతి అక్కయ్య.

పూర్వ జన్మసుకృతం, ఈశ్వరానుగ్రహంలేనిదే దివ్యమూర్తుల సాన్నిధ్యం లభించదు. వారి సాన్నిధ్యం లభించిందా మహాభాగ్యం. ఆ భాగ్యాన్ని నిలుపుకొనే సంస్కారముంటే మనోహరంగా, మాధుర్యంతో గుబాళిస్తుంది జీవితం. ఆ భాగ్యం సరస్వతి అక్కయ్యకు ప్రాప్తించింది. ఆమె సాత్వికురాలు, సున్నిత మనస్వి, అమ్మ గురించి ఓ పత్రికలో చదివిన వెంటనే అమ్మను చూడాలనే తపన తనలోరేగింది. ఓ రోజు ఇంట్లోవారికైనా చెప్పకుండా జిల్లెళ్ళమూడికి పయనమై "అమ్మ ఒడి"కి చేరుకుంది.

అమ్మదర్శనం, అమ్మతో సంభాషణం, అలౌకికానందాన్ని కలిగించే ఆ స్పర్శ తన జీవితాన్ని రంజింపచేశాయి.

అక్క తన బాధలన్నీ అమ్మకు విన్నవించింది. అమ్మ కరుణతో దీవించింది. బ్రతుకు భారం వహిస్తానని అభయమిచ్చింది. తన పాదుకలను ప్రసాదించి బ్రోచింది. నేనెప్పుడూ నీతోనే ఉంటానని ధైర్యమిచ్చి నడిపించింది అమ్మ.

తాను అనుభవించినది నెమరువేసుకుంటూ జీవిస్తుంది సరస్వతి అక్కయ్య. "అమ్మ ఒడి" నుండి తాను పొందిన అనుభూతుల స్మృతియే ఈ పుస్తకం.

దైవాన్ని నమ్మినవారికి నాశ (పాశ) ముండదనే సందేశాన్ని ధైర్యాన్నిస్తుందీ పుస్తకం.

నన్ను ఎన్నుకొని "మున్నుడి" వ్రాయించిన అంతర్వర్తినియైన దివ్యజననికి, సరస్వతి అక్కయ్యకు, భక్తులకు మరియు విజ్ఞులకు సహస్రాధిక వందనాలర్పిస్తూ...

మీ దీవెనలందుకుంటూ...

మీ

రామకృష్ణ

ఆనందాశ్రమం
లక్ష్మీపురం ఆర్. హెచ్. సి.
వడ్లపూడి పోస్టు, విశాఖపట్నం-46.

శ్రీగురుభ్యోనమః శ్రీమాత్రేనమః

జయహో మాతా శ్రీ అనసూయ రాజరాజేశ్వరి శ్రీ పరాత్పరి

# అమ్మతో అనుబంధం

సుమారుగా 1971-72 సంవత్సర ప్రాంతములో అమ్మ ఫోటోను దిన పత్రికలో చూచాను. అమ్మ అవతారమూర్తిగా ప్రకటితమై దివ్య దర్శనాలతో అనుగ్రహిస్తుందని, మాతృవాత్సల్యామృతాన్ని వెదజల్లుతున్నదని తెలుసుకున్నాను. నాటి నుండి నాలో తపన మొదలైనది. రాముడు, కృష్ణుడు మొదలైన అవతారముల చరిత్రలను చదువుతున్నాము. కథలుగా వింటున్నాము. కాని ప్రత్యక్షంగా అవతారమూర్తిని దర్శించాలనే తహ-తహ, కుతూహలం అధికమైనది. కాని అలాంటి అవకాశముగాని, అదృష్టముగాని నాకు లేదని నిర్ణయించుకొని ఆ విషయం మర్చిపోయాను. అయితే తలవని తలంపుగా నా పరిచయస్తులు అమ్మ ఫోటోను కుంకుమ ప్రసాదమును నాకు అందజేశారు. అది శ్రావణ శుక్రవారము. పూజ ముగిసి హారతి యివ్వబోతున్నాను. ఆ సమయంలో అమ్మ ఫోటో వచ్చినది. వెంటనే అమ్మను పూజా వేదిక మీద ఉంచి తొలిసారిగా హారతిచ్చాను. నాటి నుండి అమ్మ నాకు ఆరాధ్యమూర్తిగా విలసిల్లినది.

ఒక విజయదశమి రోజు మ॥12 గం॥ల వేళ సాధువు రూపంలో ఒక వ్యక్తి వచ్చి ఆజ్ఞాపూర్వకంగా భోజనము పెట్టమని కూర్చున్నాడు. నాకు తెలియకుండా ఆదరణగా భోజనం పెట్టాను. అతను మరలా కనిపించలేదు. ఆరోజే నాకు అమ్మను దర్శించడానికి జిల్లెళ్ళమూడికి వెళ్ళాలని దృఢ సంకల్పము కలిగినది. పిల్లలందరిని ప్రక్క వారికి అప్పగించి జిల్లెళ్ళమూడికి బయలుదేరాను. మా శ్రీవారు ఉద్యోగ రీత్యా హైదరాబాద్‌కు వెళ్ళారు. తెల్లవారుజాము 4 గం॥లకు బస్సు బయలుదేరినది. ఆ బస్సుకు మునుముందుగా కిరీటధారణియైన స్త్రీ మూర్తి వడివడిగా నడక సాగిస్తూ సూర్యోదయమైన తరువాత అదృశ్యమైనది. అంతవరకు నేను బయట ప్రపంచంలోకి రాలేదు. విజయవాడ లాంటి రైల్వేస్టేషన్‌లలో ఒక రైలు నుండి మారి వేరొక రైలు ఎక్కి ప్రయాణం చేయడమంటే నాకు అయోమయ పరిస్థితి ఎదురైనది. అయినా తమకు తాముగా కొందరు నా దగ్గరకు వచ్చి ధైర్యం చెప్పి వెళ్ళవలసిన రైలులో కూర్చొనబెట్టి వెళ్ళిపోయారు. రాత్రి 10 గం॥లకు

బాపట్లలో దిగాను. స్టేషన్‌కెదురుగా ఉన్న "మాతృశ్రీ ప్రింటర్స్" ప్రెస్‌కు వెళ్ళి అమ్మ దగ్గరకు వెళ్ళడానికి వచ్చానని చెప్పాను. వారు సాదరంగా మాట్లాడి ఉదయం వెళ్ళవచ్చును. ఈ రాత్రికి మేడ మీద నిద్రించవలసినదిగా చెప్పి చాప, దిండు ఇచ్చారు. అప్పుడు రాత్రి 11 గం॥లు అవుతుంది. పూర్వకాలపు ముత్తైదువులు నడుస్తున్నట్లుగా కాళ్ళ గెజ్జలు, మట్టెలు చప్పుడు వినిపించినది. నాకు భయమనిపించకపోగా లేచి మేడ చుట్టూ దిగువకు చూచాను. ఎవ్వరూ కనిపించ లేదు. తెల్లవారి స్నానాదులు ముగించుకొని బస్సులో జిల్లెళ్ళమూడికి ప్రయాణించాను. ప్రయాణికులంతా అమ్మ గురించి ముచ్చటించుకుంటుంటే విని అమ్మ నివాసం చేరాను. కొంత సేపట్లో అమ్మ దర్శనానికి గంటమ్రోగినది. అందుకు తగిన ఏర్పాట్లు జరిగినవి. అమ్మను చూడాలనే ఆతృతతో అందరికంటే ముందు వరసలో కూర్చున్నాను. అది ఆశ్వయుజశుద్ధ ద్వాదశి నేను తేనె, పసుపు కొమ్ములు, నూతన వస్త్రములు, పువ్వులు అమ్మకు సమర్పించి పాదములంటి నమస్కరించు కున్నాను. ఆ స్పర్శతో నాకు అశ్రుధారలు వర్షించసాగినవి. దర్శన కార్యక్రమము పూర్తి అయినది. భోజనాలకు గంట మ్రోగినది. భోజనం ముగించుకొని ఏదో సందడిగా ఉంటే వడివడిగా పైకి వెళ్ళాను. ఎవరో అమ్మకు పూజ చేసుకొని నివేదన చేశారు. ఆ పదార్థాలన్నీ ఒక పెద్ద పళ్ళెంలో మిశ్రమంగా చేసి అందరికి అమ్మ పంచి పెడుతున్నది. నేను కూడా అమ్మచేతి మీదుగా ఆ మహాప్రసాదాన్ని అందుకున్నాను. మధ్యాహ్నం అమ్మతో ఏకాంతంగా మాట్లాడే అవకాశం కలిగించారు. అమ్మ తన పాదాల చెంత దగ్గరగా కూర్చుండ బెట్టుకొని నా యోగ క్షేమాలు వివరంగా అడిగి చెప్పమన్నది. నేను వెళ్ళిన కారణం, అవసరం కూడా అడిగినది. కాని నేను ఆ కారణంగా వెళ్ళలేదు కనుక ఏమి చెప్పలేకపోయాను. అమ్మ తరిచి తరిచి అడిగేసరికి ఏదో ఒకటి చెప్పాలిగదా! అప్రయత్నంగా నా నోట వెలువడిన మాట "పిల్లలకు పెళ్ళిళ్ళు ఎప్పుడు చేస్తావమ్మా" అమ్మ చిరుదరహాసంతో నన్ను చూచినది. తరువాత వసుంధర అక్కయ్యతో హార్లిక్సు తెప్పించి తన స్వహస్తాలతో నాకు అందించినది. నేను వెళతానన్నాను. అమ్మ ఉండమన్నది. చిన్న పిల్లల్ని వదిలివచ్చాను అందుకని వెళ్ళాలమ్మా అన్నాను. అప్పుడు ఒక కాషాయరంగు చీర జాకెట్టు తెప్పించి నాకు యిచ్చినది. మరొక

తెల్లచీర తెప్పించి నా పెద్ద కుమార్తెకు యివ్వమని చెప్పినది. నా మనసులో అనుకున్నాను తెల్ల చీర నేను తీసుకొని ఆ రంగు చీర అమ్మాయికి ఇవ్వాలని, అమ్మ వెంటనే ఆ విషయం గ్రహించినట్లుగా తెల్లచీర దానికే యివ్వు అది మారుతుంది, అని అమ్మ బదులు చెప్పినది. ఇది ఆశ్చర్యకరమైన విషయం. ఆరోజు శుక్రవారం అయినా అమ్మ చేతికున్న గాజులు తీసి యిచ్చినది. మెడలో పూలదండలు, ఇంకా ప్రసాదాలు యిచ్చినది. ఇవన్నీ కలిసి ఒక పెద్ద సారెగా తయారైనవి. ఆడపిల్ల అత్తవారింటికి వెళ్ళే సరంజామాలాగ అనిపించినది.

ఇవన్నీ ఉంచడానికి అమ్మ తమ పాదాల క్రింద ఉన్న దిండుకవరును తీసి యిచ్చింది. అంటే అమ్మ పాదుకలు దయతో నాకు ప్రసాదించినట్లే కదా. ఇది ఇలా ఉండగా క్రిందికి ఒక కారు వచ్చి ఆగినది. ఆ కారులో వచ్చిన వాళ్ళను పైకి పిలిపించి "అమ్మాయిని జాగ్రత్తగా బాపట్ల స్టేషనులో దించవలసినది"గా అమ్మ ఆజ్ఞాపించినది. నేను బయలుదేరుతుండగా అమ్మ చెప్పినది "హైమ పుట్టిన రోజుకి రావలసినది" అని. ఎలా రాగలనని నేను ఆలోచనలో పడ్డాను. అమ్మ మళ్ళా చెప్పినది ఆ నాటికి రావలసినదని, నేను తల ఊపాను. తిరుగు ప్రయాణంలో విజయవాడ స్టేషన్‌కు వెళ్ళేసరికి తెల్లవారు జాము 4 గం॥ అయినది. అప్పుడు నేను కల, మెలుకువగాని స్థితిలో ఉన్నాను. సీటులో కూర్చుని ఉన్న నాకు (అమ్మ సుప్రభాతం చేసుకుంటూ) నడుము చుట్టూ చేతులు వేసి ఆలింగనము చేసుకొని నా ముఖములో ముఖముపెట్టి మహదానందముగా నవ్వుతూ ఉండడము అమ్మ నాతో కూడా వస్తున్నదని అనిపించినది.

అసలు దీనికంతటికి మూలం అమ్మ అందరికీ ప్రసాదంగా ఇచ్చే కుంకుమ నేను నా నుదటను ధరించడమే. ఆ కుంకుమలో అనిర్వచనీయమైన శక్తి ఇమిడి ఉన్నది. అది అమ్మ చెంతకు చేర్చే నౌకలాంటిది.

శిరిడీ సాయిబాబా అన్నట్లు పిచ్చుక కాలికి దారం కట్టి తన చెంతకు లాక్కుంటానని అంత ప్రభావం ఈ కుంకుమలో ఉన్నది.

అమ్మ ఆజ్ఞానుసారం విచిత్ర పరిస్థితులలో 15 రోజులలోపు నేను జిల్లెళ్ళమూడి వెళ్లడం జరిగింది. ఆ వెళ్ళడంతోపాటు ఒక మహత్యం జరిగింది. మా వదిన గారి తమ్ముడు, మరదలు కూడా ఇద్దరూ డాక్టర్లు. వారికి సంతానము లేక

బాధపడుతున్నారు. వైద్య విజ్ఞానములోను, ఆధ్యాత్మిక పరంగాను అన్ని ప్రయత్నాలు చేసి విఫలమైనారు. ఆ తపనతో వారు నాతో అమ్మ దగ్గరకు వచ్చారు. అయితే సంతానము కలుగవలసిన వయసు ఆమెకు దాటిపోయినది. వారు అమ్మ దర్శనం చేసుకొని తీర్థ ప్రసాదాలు తీసుకొని వెళ్ళారు.

తరువాత ఆమెకు పుత్ర సంతానం కలిగింది. అదే ఇక్కడి మహత్యం. యెనలేని ఆనందముతో వారు అమ్మను వరాలిచ్చే దేవతగా ఆరాధించుకుంటున్నారు. హైమ పుట్టిన రోజు పండగ కార్యక్రమంలో ఆనందముగా పాలుపంచుకొని మా యింటికి వెళ్ళడానికి అమ్మను అనుమతి కోరాను. అందుకు అమ్మ "వాళ్ళు రమ్మని పిలిచే వరకూ హాయిగా యిక్కడే ఉండు" అన్నది.

అది కార్తీక మాసం. ఉదయం 4-30 ని॥లకు అమ్మ సుప్రభాతంలో మొదలయిన దినచర్య రోజంతా అభిషేకాలు, పూజలు సంధ్యావందనము, అమ్మ చెంత కూర్చొని ఆనందించడం ఇలా 21 రోజులు గడిచినది. యధాతథంగా ఉదయాన్నే అమ్మకు నమస్కరించుకుందామని వెళ్ళాను. అమ్మ "వెంటనే బయలు దేరి వెళ్ళు" అని చెప్పింది.

దానికి కారణం 1. నా కోసం మాయింటి నుండి జవాను జిల్లెళ్ళమూడికి బయలుదేరాడు. ఆ రోజు తరువాత 1 నెల రోజుల వరకు ఎటువంటి ప్రయాణాలు లేక నిలిచిపోయినవి. ఒక ప్రక్క వరదలు, వేరొక ప్రక్క బందులు, ధర్నాలు ఇల్లు చేరిన తరువాత ప్రతిరోజు జిల్లెళ్ళమూడిలో వలే సుప్రభాతము, పూజ, సంధ్యావందనాలు కార్యక్రమాలు నేను ఇంట్లో జరుపుకుంటూ ఉన్నాను. ఆ సమయంలో కొన్ని వింతలు జరిగాయి. నేను పూజలో ఇంట్లో ఉండగానే ఇంకొక చోట నేను తెల్ల చీరలో మా బాబుకి కనిపించానట నీవు రెండు చోట్ల ఎలా ఉన్నావు ? ఇప్పుడు నిన్ను ఇంట్లో చూచాను అన్నాడు.

చింతపల్లిలో ఒక ఉద్యోగి తన ఉద్యోగం నుండి తాత్కాలికంగా తొలగించ బడ్డాడు. అతనికి స్వప్నంలో నేను పోలీసు బలగంతో వాళ్ళ యింటికి వెళ్ళినట్లు చూచాడట. వెంటనే అతని ఉద్యోగానికి రావలసినదిగా ఆర్డరు వచ్చినదట. నా రూపంలో అమ్మ అతనిని అనుగ్రహించినది. ఆనందముతో చెప్పుకున్నాడు. ఆ విధంగా చింతపల్లి గ్రామములో అమ్మ గురించిన ప్రచారము జరిగినది.

ఆ తరువాత మాకు అక్కడ నుండి వేపాడుకు బదిలీ అయినది. పెండ్లికి ఎదిగిన ఆడపిల్లలు, ముగ్గురున్నారు. మా ప్రమేయం లేకుండానే సంబంధాలకు ఇద్దరమ్మాయిలకు వివాహాలు జరిగినవి. మాకు ఆర్థిక స్తోమత లేదు. ఆ గ్రామస్థులు, ప్రక్క గ్రామాల ప్రజలందరూ సహకరించి తమ తమ సొంత బిడ్డలలాగా ఆదరణ చూపి కార్యక్రమం నెరవేర్చడం అమ్మ యొక్క పరిపూర్ణమైన అనుగ్రహంగా విశదమైనది.

**అగ్రామంలోని వింతలు :**

పూరిండ్లకు నిప్పంటుకున్నది. ఒక చాకలి వానికి అమ్మ కనిపించినది (నా రూపంలో) ఎడమ చేతితో నీళ్ళ గ్లాసు పట్టుకొని కుడి చేతిలో ఆ నీటిని పోసుకొని ఆ మంటలు మీద చల్లినట్లుగా, వెంటనే మంటలు చల్లారిపోయినవి. అందరూ అమ్మ మహాత్యంగా గుర్తించి ఆశ్చర్య చకితులయినారు.

మా యింట్లో పూజచేసుకొని ఊరేగింపుగా బ్యాండు వాయిద్యాలతో గ్రామం వీధులలోకి వెళ్ళి కుంకుమ, ప్రసాదం పంచుతున్నాను. ఆ సమయంలో 6 సం॥ల బాబు విపరీతమైన కడుపు నొప్పితో బాధపడుతున్నాడు. అమ్మ ప్రసాదం యివ్వగానే వెంటనే తగ్గిపోయింది. కొన్ని సంవత్సరాలుగా ఉన్న కడుపునొప్పి మరలా రాలేదట. ఆపరేషన్ చేయించాలని అనుకొన్న ఆ తల్లిదండ్రులు ఎంతో ఆనందపడి కృతజ్ఞతా భావంతో అమ్మను పూజించుకొనుట ప్రారంభించారు. జిల్లెళ్ళమూడి నుండి పెద్ద మొత్తంలో ప్రసాదాలు తెప్పించి గ్రామస్తులందరికీ అందించేదాన్ని.

ఒక గర్భిణీ స్త్రీ 3 రోజులుగా ప్రసవ వేదన పడుతున్నదట. నాకు తెలిసిన వెంటనే అమ్మ ప్రసాదం పాలలో కలిపి ఇచ్చాను. సుఖంగా ప్రసవించి మగబిడ్డను కన్నది. ఇంకా ఎందరికో ఎన్నో అనుభవాలు కలిగినవి. వాళ్ళంతా బస్సు వేసుకొని జిల్లెళ్ళమూడి వెళ్ళి అమ్మను దర్శించుకున్నారు. అప్పుడు వాళ్ళు అమ్మను అడిగారట. మీ భక్తురాలట, ప్రసాదం యిస్తే మాకు జ్వరాలు తగ్గి ఆరోగ్యంగా ఉండేవాళ్ళం ఆమె ఎక్కడున్నారని.

ఆ తరువాత నేను అమ్మదర్శనానికి వెళ్ళినపుడు "నీవు ప్రసాదమిస్తే జబ్బులు తగ్గినాయట నాకు కూడా ఇవ్వు" అని చిరుదరహాసంతో అమ్మ నావైపు వాత్సల్యపూరిత దృక్కులు ప్రసాదించినది.

ఆ తరువాత 4 సం॥ వరకు నాకు అమ్మ దర్శన భాగ్యం లభించలేదు. మా ప్రక్క వీధిలో ప్రకాశరావని ఒక ఉద్యోగి అమ్మ దగ్గరకు వెళ్ళారు. మాటల సందర్భంగా అతను అమ్మను అడిగారట "సరస్వతి అక్కయ్య వచ్చినదా ?" అని, అప్పుడు అమ్మ "కూతుళ్ళ పెండ్లి అయిపోయినవి కదా! ఇంకెందుకొస్తుందని" దరహాసంతో చెప్పినదట. ఆమె వదనంలో విజయ గర్వం తొంగిచూచిందని ఆ అన్నయ్య నాకు ఆనందంతో చెప్పాడు. నీ వంటే అమ్మకు ఎంత కరుణ అని సంతోషంగా చెప్పాడు.

ఆ సం॥ అనంతరం నేను అమ్మ దర్శనం చేసుకోగలిగాను. నన్ను పిలిపించుకొని అమ్మ తన పాద సన్నిధిలో కూర్చుండ బెట్టుకొని యోగ క్షేమాలు అడుగుతున్నది. ఆ తీరు నాలో దుఃఖం పెల్లుబికేలా చేసింది. "పిల్లలంతా బాగున్నారా ? ఆయన నిన్ను బాగా చూచుకుంటారా ? జీతం సరిపోతున్నదా ? ఇంకా ప్రమోషన్ రాలేదా ? అమ్మ అనురాగం, వాత్సల్యం ఇలా ప్రశ్నల రూపంలో కుంభవృష్టిగా వర్షించింది. జీవితంలో ఎప్పుడూ, ఎవ్వరూ ఈ విధంగా నా యోగ క్షేమాల గురించి పట్టించుకొన్న వాళ్ళులేరు. ఆ కారణంగా నేను దుఃఖసాగరంతో మునిగిపోయాను. ఉపశమనం కోసం అన్నట్లు అమ్మ నన్ను మరింత దగ్గరకు తీసుకొని తన పాదాలకున్న పాదుకను విడిచి అమ్మ పాదాలను నా శిరస్సును తాకించి కరుణ పొంగులు వార "నీవు బాధ పడనవసరం లేదు. నేనెప్పుడూ నీలో ఉంటాను. నీవు నాలో ఉంటావు అని అభయమిచ్చినది. తరువాత కొన్ని రోజులు అమ్మ సన్నిధిలో ఆనందంగా గడిపాను. ఒకరోజు సాయంకాలం అమ్మ కివ్వాలని గ్లాసుతోపాలు తీసుకొని వెళ్ళాను. అదే సమయానికి అమ్మ పాలు తీసుకుంటున్నది. "ఏమిటి" అని అమ్మ ప్రశ్నించినది. నీకు పాలు తీసుకొచ్చానని చెప్పాను. తాను త్రాగుతున్న పాలలో నుండి నా గ్లాసులో కొన్నిపాలు పోసి తీసుకోమన్నది. ఆ విధంగా అమ్మ నాపైగల వాత్సల్యానికి మరోసారి మురిసిపోయాను.

అమ్మ సన్నిధిలో ఒక వింత వివాహం జరిగినది. ఏ ఆధారంలేని ఒక స్త్రీ ఇద్దరు పిల్లలతో ఆత్మహత్యా ప్రయత్నం చేస్తుండగా ఒక తమిళియన్ చూచి

కాపాడి తన యింటికి తీసుకువెళ్ళాడు. తరువాత ఆ పిల్లలతో సహా ఆమెను అమ్మ సన్నిధికి తీసుకువచ్చి తాను ఆమెను వివాహమాడతానని, పిల్లలకు తండ్రిగా ఉంటానని అమ్మకు విన్నవించుకున్నాడు. అమ్మ ఆనందంతో వాళ్ళకు పెళ్ళి జరిపించి దంపతులను చేసి ఆశీర్వదించినది. అప్పుడు ఫోటో గ్రాఫర్ వచ్చాడు అమ్మ పాద సన్నిధిలో కూర్చొని ఫోటో తీయించుకోవాలనే చిరకాలంగా నాకు వాంఛ ఉన్నది. అమ్మ తన దివ్య చరణాల చెంత అనుగ్రహంతో స్థాన మిచ్చి ఫోటో తీయమని ఆదేశించినది. జన్మసార్ధకమైనదని పారవశ్యంతో ఆనందానుభూతిని పొందాను.

హైమాలయంలో ఒకరోజు నేను నామం చేస్తున్నాను. అమ్మ అది విని ఎవరా నామం చక్కగా చేస్తున్నారని అడిగితే ప్రక్కన ఉన్న అక్కయ్య సరస్వతి అని చెప్పినదట. అక్కయ్య నాతోచెప్పి తాను కూడా ఆనందించినది.

ఒకరోజు ఒకరు వాళ్ల పాపకు అమ్మవద్ద "అడుగుకు అరిసెలు" వేడుక జరుపుకుంటున్నారు. నేను మాయింటికి వెళ్ళవలసిన రోజు దగ్గరకొచ్చినదని దిగులుగా అక్కడ కూర్చున్నాను. అప్పుడు అమ్మ నా పేరుతో "అమ్మా సరస్వతీ తాంబూలం తీసుకో" అని పిలిచి తన మృదు కరములతో నాకు తాంబూలం అందించింది.

## "సరస్వతీ సామ్రాజ్యం" సభ జరిగినది

కవి, గాయక, పండిత ప్రముఖులు అమ్మకిరువైపుల బారులుతీరి ఆసీనులై ఉండగా అమ్మ సరస్వతీదేవిగా వింతకాంతులు వెదజల్లుతూ దర్శన మిచ్చిన నయనాందకరమైన ఆ సుందర దృశ్యం జన్మలో మరువరానిది. శ్రీయుతులు ప్రసాదరాయ కులపతి, పి.ఎస్.ఆర్. అంజనేయ ప్రసాద్, పన్నాల రాధాకృష్ణ శర్మ, కరుణశ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి తదితరులు ఆయా పాత్రలు పోషించి వీనుల విందు చేశారు.

శ్రావణమాసంలో మంగళవారాలు, శుక్రవారాలు వ్రతాలు, పూజలు చేసుకొని అమ్మకు నూతన వస్త్రాలు, నివేదనలు సమర్పించుకొని ముత్తైదువలందరూ భక్తి పారవశ్యంతో ఇనుమండించిన ఆనందోత్సాహాలతో అమ్మ చెంతగడిపిన మధురస్మృతులతో ఆజన్మాంతము హాయిగా బ్రతికేస్తాను. కొంత కాలం తరువాత మళ్ళా ఒకసారి మావారితో, పిల్లలతో కలిసి అమ్మ సన్నిధికి వెళ్ళాను. అమ్మ

ఆదేశానుసారం శ్రీమతి భ్రమరాంబ అక్కయ్య ఆదరణతో 10 రోజులు అమ్మ నివాసంలో హాయిగా గడిపాము. మేము పూజ చేసుకుంటామని అమ్మను కోరాను. పూర్ణిమనాడు చేసుకోమని అనుజ్ఞ ఇచ్చినది. అప్పటికి 4 రోజుల వ్యవధి ఉన్నది. అమ్మకు, నాన్న గారికి నూతన వస్త్రాలు తెప్పించాను. అంధ సోదరులుండేవారు. యార్లగడ్డ రాఘవయ్య అన్నయ్య 'అమ్మ' హరికథ చాలా బాగా చెపుతాడని విన్నాను. అర్థించగా అన్నయ్య అంగీకరించాడు. అన్నయ్యకు కూడా నూతన వస్త్రాలు తెప్పించాను. ఆరోజు రానే వచ్చినది. పూజ సమయం దగ్గర అవుతున్న కొలదీ నాకు ఆతృతగా ఉన్నది. అమ్మ దగ్గరకు వెళ్ళాను. "నాన్న గారిని నువ్వు పిలువు వస్తారు" అని అమ్మ ఆదేశించింది. మేడ దిగి నాన్న గారి దగ్గరకు వెళ్ళి అమ్మ మాటగా నేను విన్నవించాను. నాన్న గారు వెంటనే అంగీకరించి మేడ మీదకు వచ్చారు. ఆ చిన్న మంచం మీద అమ్మ, నాన్న గారు ప్రక్కన్న కూర్చుంటే చూచే వారికి అదొక మధురానుభూతి. చాలా మంది అక్కయ్యలు, అన్నయ్యలు, చిన్నారులు ఆనందాతిశయంతో ఆ కార్యక్రమం తిలకించడానికి ఆశీనులైయున్నారు. నిండు పున్నమి, పండు వెన్నెల అంతకు మించి పున్నమి చంద్రుని మించి వెలుగొందే అమ్మ శ్వేతాంబరధారియై, లక్ష్మీదేవివలె తన దివ్య కాంతులను ప్రసరింపజేస్తూ దరహాసంతో వెలుగొందు ఆ దివ్య సుందర మూర్తిని దర్శించి అనుభూతి పొందవలె గాని వర్ణింప భాషలేదు.

అమ్మను, నాన్నగారిని సుమ మాలాలంకృతులను చేశాము. శ్రీ అంబికా అష్టోత్తర శత నామములతో పూజించుకున్నాము. మేము వైజాగ్ నుండి తెచ్చిన బియ్యంతో (పూటకు గుప్పెడు దాచిన) పులిహోర చేయించారు. రకరకాల పండ్లతోపాటు ఆ పులిహోర నివేదన చేశాము. అమ్మ చేతితో తాకి అటు ఇటు త్రిప్పి "ఇంకా పక్వం కాలేదు" అని మృదు మధురంగా పలికినది. అంటే నా భక్తి పరిపక్వం కాలేదేమో అని నేను భావించాను. తాంబూలము సమర్పించి స్వయంగా శ్రీ సూక్తం మంత్ర పుష్పం అమ్మకు సమర్పించుకున్నాను. అమ్మ, నాన్న గార్ల గళసీమలనున్న పుష్పమాలలు మాయిరువురకు వేసి పూలుజల్లి ఆశీర్వదించినది. ప్రసాదాలు పంచబడ్డాయి. అంధ సోదరుడు శ్రీ యార్లగడ్డ రాఘవయ్యగారు శ్రావ్యంగా అమ్మ హరికథాగానం చేశాడు. అమ్మ, నాన్న గార్లతో సహా అందరూ

మంత్రముగ్ధులై విన్నారు. సాక్షాత్తూ ఆదిపరాశక్తియైన అమ్మను సతీసమేతంగా తనివి తీర స్వహస్తాలతో పూజించి, నోటితో ఆనామోచ్ఛారణ చేసి, మనస్సుతో భావన చేసి పరవశమై నా జన్మ సార్థకత సంతరించుకొన్నది. ఈ జన్మకిది సాటిలేని తృప్తి కదా!

దివిసీమకు వరదలు వచ్చినపుడు ఆ బిడ్డలను ఆదుకొని ఆశీర్వదించడానికి అమ్మ అక్కడకు వెళ్ళినది. అపుడు అమ్మ బాపట్లలో శ్రీదినకర్ అన్నయ్య ఇంట విడిది చేసినది. మేము బండి దిగి అమ్మను దర్శించుకోడానికి దినకరన్నయ్య ఇంటికి వెళ్ళాము. అదే సమయానికి అమ్మకు నివేదన చేయడానికి ఒక సోదరునిచే దద్ధోజనం తీసుకొని రాబడినది. లోపలకు వెళ్ళిన నాకు అమ్మ కారుణ్య కరములతో నా దోసిట్లో దద్ధోజనం వేసినది.

ఒక సంవత్సరం దసరా పూజలకు శ్రీయుతులు లక్ష్మీనారాయణ అన్నయ్య, ధర్మసూరి, ఐ.రామకృష్ణగారులు దీక్ష తీసుకున్నారు. వీరు అనితర సాధ్యంగా అమ్మ కరుణకు పాత్రులైనారంటే అతిశయోక్తి కాదు. అమ్మ సన్నిధిని కూర్చొని లక్ష్మీ ప్రదమైన శ్రీ కనకధార స్తోత్రము, అన్నపూర్ణాష్టకము మొదలగు పారాయణలు చేసి అమ్మకు మహానివేదనలిచ్చి తాంబూలము, దక్షిణలు సమర్పించేవారు. వారితో పాటు నేను కూడా తాంబూలంతో 11 రూ॥ దక్షిణ ఉంచి అమ్మకు సమర్పించు కున్నాను. ఆ 11 రూ॥ తీసుకొని కొండముది రామకృష్ణ అన్నయ్యకిచ్చి "ఇది నా అకౌంటులో వేయండి రా" అని చెప్పినది. అంటే అమ్మ బ్యాంకు అకౌంటులో కూడా నా భాగమున్నదని ఎంతగానో ఆనందించాను.

అమ్మ సన్నిధిలో శ్రీ చండీ యాగము జరుగనున్నది. శ్రీయుతులు తంగిరాల కేశవశర్మ అన్నయ్యగారి ప్రోత్సాహంతో శ్రీ దుర్గా సప్తశతి 40 రోజులు దీక్ష తీసుకొని పారాయణ చేసి ఆ యాగంలో పాల్గొని అమ్మ ఆశీస్సులు పొందాను.

తన బిడ్డలెందరికో అమ్మ శ్రీ గాయత్రీ మంత్రోపదేశం చేసినది. వారిలో నేను కూడా ఉన్నాను. దీక్షగా 40 రోజులు జపమైతే చేశాను. కాని శ్రీ గాయత్రీ యాగములో పాల్గొనుటకు జిల్లెళ్ళమూడి వెళ్ళలేకపోయాను. యాగము పూర్తి చేసుకొని విశాఖ సోదరీ, సోదరులందరూ అమ్మ సన్నిధిలో చేరారు. అప్పుడు అమ్మ వారితో అన్న మాటలు "సరస్వతి అన్నింటికి ముందుంటుంది కదా

అదిరాలేదేమని" ఈ విషయం కేశవ శర్మ అన్నయ్య సతీ సమేతంగా మాయింటికి వచ్చి ఫలానా రోజు రాత్రి నీవు ఏమి చేస్తున్నావని అడిగారు. ఎందుకు ? అన్నాను. అమ్మ నిన్ను ఆ సమయంలో తలచిన దమ్మా అని ఎంతో సంతోషంగా చెప్పారు. అమ్మ అనుగ్రహాన్ని తలచుకొని నేను తన్మయంతో అవాక్కయిపోయాను అమ్మ మాటకు. "మనసు జిల్లెళ్ళమూడిలో ఉంటే మనిషి ఎక్కడున్నా ఒకటే అందుకు నిదర్శనంగా కుసుమ అక్కయ్య నాతో ఈ విషయం చెపితే నేను ఆశ్చర్యపోయాను.

అమ్మ సంధ్యాగాయత్రిగా ఆ చిన్న మంచము మీద సుఖాసీనయై ఉన్నది. అమ్మ కిరువైపులా విద్యార్థినీ, విద్యార్థులతో పాటు నేను కూడా సంధ్యావందనము పాడుకుంటున్నాను. ఇంతలో మా బాబు చిన్నవాడు కావడం వలన ఆటలాడుతూ పడిపోయాడు. వసుంధరక్కయ్య చెల్లెలు అమ్మాజీ తీసుకొచ్చి అక్కా నీ కొడుకు పడిపోయాడు దెబ్బ తగిలినది నుదుటి మీద రక్తం వస్తున్నదని చెప్పినది. అయినా నేను పట్టించుకోకుండా సంధ్యావందన ధ్యాసలో ఉండిపోయాను. అమ్మ వాడిని తీసుకొని ఎత్తుకొని తన స్నానాలగదికి నడిచి వెళ్ళి గాయం తుడిచి, కుంకుమ అద్ది తిరిగి తీసుకువచ్చి తన వడిలో కూర్చుండ బెట్టుకొని వాడితో అన్నది పడిపోతే నిన్ను పట్టించుకోలేదు మీ అమ్మను కొట్టమంటావా? అని అడిగింది. వాడు వద్దంటూ తల అడ్డంగా తిప్పాడు. అప్పుడు అమ్మ అన్న మాటలు "మీ అమ్మను కొడితే దేవతలు దిగివస్తారు నాన్నా" ఆ రోజులలో అమ్మ పలికే ప్రతిమాట శ్రీ గరుడాద్రి గారు గ్రంధస్తం చేసేవారు. నా విషయాలు అమ్మ పలికిన ఈ మాటలు కూడా వ్యాఖ్యానించబడినవి.

నీ అనుంగు బిడ్డలను మా యింటికి పంపించమ్మా వారిలో నిన్ను చూచుకుంటానని అమ్మను మనసులో వేడుకొన్నాను. శ్రీ పన్నాల రాధాకృష్ణ శర్మగారు, రామకృష్ణ అన్నయ్య విశాఖకు వచ్చారు. మా యింటికి వచ్చి నన్ను ఆనందాశ్చర్యాలతో ముంచి వేశారు. మేము వెళ్ళగానే అమ్మ మీ గురించి అడుగుతుంది అందుకే వచ్చామని అన్నారు.

ఎన్. లక్ష్మణరావుగారు, భ్రమరాంబ అక్కయ్య అమ్మకు ఎంతో ప్రీతిపాత్రులు. బ్యాంక్ ఆఫ్ బరోడాకు విశాఖపట్నం బదిలీ అయినదట. అక్కయ్య తను ఒంటరిగా

ఉండాలని దిగులుపడుతున్నదట. అందుకు అమ్మ "అక్కడొక పిచ్చిది ఉన్నది" వెళ్ళు నీకు తోడుగా ఉంటుంది అని చెప్పినదట. ఇటీవల అక్కయ్య నాకు విషయము చెప్పింది. నా హృదయం ఉప్పొంగి పరవళ్ళు తొక్కింది, అమ్మ దృష్టిలో ఆ విధమైన స్థానం నాకున్నందుకు.

శ్రవణం, కీర్తనం, స్మరణం మొదలగు భక్తి మార్గములలో అమ్మను సేవించుకునే సదవకాశము జన్మ జన్మల సుకృతం వలన నాకు లభించినదని సవినయంగా తెలుపుకొనుచున్నాను. నేను అమ్మ దగ్గరున్న రోజులలో అమ్మకు బట్టలుతికే చాకలి 3 రోజులు రాలేదు. ఆ కారణంగా ఆ సేవా భాగ్యం లభించినది. అమ్మ స్నానం చేసే గుండిగలు తోమడం, మరుగుదొడ్డి శుభ్రం చేయడం, సాయంకాలంలో అమ్మ కూర్చున్న స్థలం కడిగి ముగ్గులు పెట్టడంలాంటి పనులలో అమ్మకు దాస్యం చేసుకున్నానన్న తృప్తిని పొందాను.

సుశీలక్కయ్య అమ్మకు స్నానం చేయిస్తున్నది. అప్పుడు అమ్మ నన్ను పిలిపించుకొని నా చేత 3 బిందెల నీళ్ళు పోయించుకున్నది. ప్రత్యక్షంగా అమ్మకు అభిషేకం చేసుకున్న ఆనందం పొందాను.

1985 సం॥ మే నెల 5వ తేదీ అమ్మ కళ్యాణమహోత్సవం తరువాత నేను విశాఖపట్నం బయలు దేరాను. అమ్మ దగ్గర సెలవు తీసుకొనే నిమిత్తం వెళ్ళాను. ఆ విషయం అమ్మతో చెప్పడానికి నా గొంతు మూగపోయినది. మంచముపై కూర్చొని అమ్మ బొజ్జకు నాతల ఆనించి అమ్మను పట్టుకొని భోరున ఏడ్చాను. అమ్మ నయనాలు అశ్రుపూరితాలైనవి. కొంతసేపటికి తేరుకొని అమ్మతో విన్నవించు కున్నాను. అప్పుడు తాను వాడుకుంటున్న పాదుకలిచ్చి తీసికెళ్ళమని చెప్పినది "జాగ్రత్తగా వెళ్ళమ్మా పమిటికొంగు కప్పుకో" అంటూ అప్పగింత రీతిలో మాట్లాడినది. మళ్ళా ఇంకెప్పుడూ భౌతికంగా అమ్మను చూడలేకపోయాను. జూన్ 12వ తేదీన దుర్భరమై కర్ణకఠోరమై గుండెలు పగిలే వార్త వినవలసి వచ్చినది. ఊహించుకుంటే అప్పుడర్థమైనది.

అమ్మ ఆ విధంగా కంటతడి పెట్టడం, జాగ్రత్తలు చెప్పడంలోని ఆంతర్యం.

## అమ్మ మహా సమాధి తరువాత

అమ్మ గుడిలో కార్యక్రమాలు నిర్వహించే పద్మావతి అక్కయ్య ఊరువెళ్ళింది. ఆ సేవా భాగ్యం నాకు అనుగ్రహించినది అమ్మ. తెల్లవారు జామున 4 గం॥ నుండి అమ్మకు స్నానం చేయించడం చీరకట్టి అలంకరణ చేసి ఉదయం పూజకు సిద్ధం చేయడం, త్రికాలాలలో నివేదన మొదలైన పనులన్నీ నిర్వర్తించాను. ఈ విధంగా సుమారు 2 నెలల 15 రోజులు అమ్మ నివాసంలో ఉండగలగడం నాకు సేద తీరినట్లుగా అనుభూతి పొందాను. తిరిగి ఇంటికి వెళ్ళిన తరువాత అనతి కాలంలోనే నా జీవితంలో ఊహించని మలుపు తిరిగింది. ప్రపంచం దృష్టిలో మంచి-చెడు, కష్టం లాంటివి ఏవైనా నా దృష్టిలో అంతా నా సుఖం కోరి అమ్మ చేసిన పరిణామాలే. నా చిన్న కొడుక్కి ఉద్యోగం వచ్చినదని చెపితే సరళ అక్కయ్య నీ కోసమే అమ్మ వాడికి ఉద్యోగం ఇప్పించినది అని ఘంటాపథంగా చెప్పింది. అది కూడా చాలా ఆశ్చర్యకరమైన విధంగా వచ్చింది. ఒక్క రోజు గడిస్తే వయసు దాటి పోతుంది. ఉద్యోగం వచ్చే అర్హత చేజారిపోతుంది. సాటి వాళ్ళంతా సుమారు 40 వేలు ఖర్చు పెడితేనే గాని ఆ ఉద్యోగం పొందలేకపోయారు. ఆ ఒక్క అవకాశంపోతే ఇంక స్టీల్‌ప్లాంట్‌లో సెలక్షన్ కాదు. అలాంటి పరిస్థితులలో వాడికి ఉద్యోగం దొరికింది.

ఏ విషయంలోనైనా అమ్మ అనుగ్రహం పరిపూర్ణంగా నాయందు ఉన్నదని నా ధృడ విశ్వాసం.

పెనుతుఫానులో కూడా చెదరని గడ్డిపోచవలె ఎన్నో కష్టనష్టాలు సంభవించినా చెదరని ఆత్మస్థైర్యాన్ని అమ్మ నాకు యిచ్చిన వరం. తృప్తే ముక్తి - వైకల్యం లేనిదే కైవల్యం అన్న అమ్మ సూక్తులు నా జీవితంలో అక్షర సత్యాలు. ఎందుకంటే నా బాధలు, వ్యధలూ అన్ని అమ్మ మింగేసింది.

ఒకరోజు నన్ను సన్నిధిలో కూర్చుండబెట్టుకొని వసుంధర అక్కయ్యను దానిమ్మ గింజలు తీసుకురమ్మని ఆదేశించినది. అవి ఒక్కొక్కటి ఆరగిస్తూ నన్ను ప్రశ్నలు వేసి జవాబు చెప్పించుకుంటూ అవన్నీ స్వాహా చేసేసింది. ఆ తరువాత ఆ గదిలో అమ్మ - నేను మౌనంగా సుమారుగా ఒక గంట ఉన్నాము. మరి ఆ సమయంలో ఎటువంటి కరుణ కురిపించినదో ఏ ఆశీర్వచనం ప్రసాదించినదో నాకు మాత్రం తెలియదు.

నా శేష జీవితం ఆనందధామమే అయినది. నాకు చదువులు - పదవులు లేవు అయినా కోటీశ్వరులు - లక్షాధికారులు - పెద్ద హోదాలు ఉన్నవారు పొందలేని "హాయిని" "ఇంతకంటే గొప్ప మాట నా భాషకందలేదు" సర్వదేవ దేవీ స్వరూపిణి అయిన అమ్మ నాకు ప్రసాదించినది. ఈ విషయం ఇప్పుడు నేను స్వానుభవంతో తెలుసుకున్నాను కానీ 50 సం॥ల వెనక్కి వెళ్లి గుర్తు చేసుకుంటే అమ్మ ఎప్పుడూ నన్ను కాపాడి సంరక్షిస్తూనే ఉన్నది.

1953 సం॥ మాకు వివాహం జరిగినది. నుదుట ఉదయభానుని పోలిన పెద్దబొట్టు, చేతినిండుగా గాజులు, తెల్లని చీర ధరించిన స్త్రీమూర్తి చేతులెత్తి తలవైపుగా నిలబడి (తెల్లవారు జామున) నీవు గర్భవతివవుతావని ఆశీర్వదించినది. మొదటిసారి పాప పుట్టినది. బంధువులు "అన్నపూర్ణ" అని నామకరణం చేశారు. నేను మొదటిసారిగా జిల్లెళ్ళమూడి వెళ్లినపుడు హైమాలయంలో నాకు స్వప్నంలో దర్శనమిచ్చి ఆశీర్వదించిన మూర్తిని దర్శించాను. ఆ కళ్యాణకరములు అమ్మవిగా గుర్తించి నా ఆరాధ్యదైవమయిన శ్రీకృష్ణ పరమాత్మ అడగకుండానే అన్నీ యిచ్చి అవసరాలు తీర్చే మాతృమూర్తిగా అవతరించి నా పాలిట కామధేనువయినది. స్వర్గమంటే ఎలా ఉంటుందో తెలియదు కాని ఇప్పుడు మా దంపతులము వృద్ధాప్యంలో ఎవ్వరూ పొందలేని హాయిని, ఆనందాన్ని అనుభవిస్తూ అమ్మ బిడ్డలమైన మీ అందరితో నా అనుభూతి, ఆనందమును పంచుకొని తృప్తి పొందాలనే ఆకాంక్షతో వ్రాసాను.

"అమ్మ సూక్తులు వివరణ" గ్రంధరచయిత అమ్మను భౌతికంగా చూడనప్పటికీ అమ్మ అపారకరుణకు పాత్రుడైనవాడు చిరంజీవి రామకృష్ణ. అతని ప్రేరణతోనే ఇలా నేను వ్రాయడం జరిగినది. వెలుగులోకి తీసుకొనివచ్చి తమ తమ కరకమలాలకందించిన ఘనత చిరంజీవి రామకృష్ణకే దక్కినది. ఆతనిని ఇంకా ఉన్నత శిఖరాలనధిరోహింపజేయవలసినదిగా అమ్మను పదేపదే వేడుకుంటున్నాను.

అమ్మ చెప్పినట్లు అందరూ మహానుభావులే, మీ అందరికీ ఇంతకంటే మధురమైన అనుభూతులుంటాయి. అయినా కొందరు ప్రేమతో అమ్మతో నీ అనుభవాలు వినాలనే ఆత్మీయుల కోరికపై ఇలా చేయడం జరిగినది. ఓర్పుతో ఇంతసేపూ చదివినందులకు కృతజ్ఞతాభివందనములు తెలుపుకుంటూ...

ప్రేమతో.... అమ్మ అనుంగుబిడ్డ

మీ సరస్వతి అక్కయ్య



అమ్మ సన్నిధిలో శ్రీ అప్పారావుగారు - సరస్వతక్కయ్య

"అమ్మ"

అక్కున చేర్చుకునే 'ఒడి'
జీవిత నడకలు నేర్పే 'బడి'
ఆనందపు పంట నిచ్చే 'మడి'
వరాలిచ్చే 'గుడి'
ప్రేమ - క్షమ
అనురాగం - అభిమానం
మాధుర్యం - లాలిత్యం
దివ్యగుణముల మేలుకలయికే 'అమ్మ'

- రామకృష్ణ